భయం: ఏమిటా రొద?

ఆశ: సముద్రపు హోరు.

భయం: ఏమి టిదంతా?

ఆశ: కోనేటిరావు మళ్ళీ కలగంటున్నాడు.

భయం: ఈమారేమిటి? సముద్రంలో ఏం చేస్తున్నాడు?

ఆశ: పంచమప్రపంచ మహాయుద్ధాన్ని భావిస్తున్నాడు.

భయం: ఓహో ఎంత దివ్యంగా ఉంది. ఆ యుద్ధంలో కోనేటిరావు ప్రధాన పాత్రధారి కాబోలు.

ఆశ: ఔను. ఈ సారి ఈయన జర్మన్ సబ్మెరీన్ కమాండర్ జుటావల్ కోనేట్.

భయం: అయితే ?

ఆశ: అట్లాంటిక్ మహాసముద్ర గర్భంలో అతనిజలాంతర్గామి తిమింగలం లాగ విహరిస్తోంది.

భయం: బాగుంది.

ఆశ: సుదూరంలో ముప్పై అయిదు వేల టన్నుల శత్రు యుద్ధ నౌకను పసికట్టాడు కోనేట్. దాన్ని టార్పిడో చెయ్యమని తన పరివారాన్ని ఆజ్ఞాపించుతున్నాడు.

కోనేటి: (నిద్రలో) వెల్టాన్ షౌంగ్ డెర్ ఉంటర్ డెన్ లిండెన్! గెస్టాల్టు డెర్ డాయిష్లాండ్ ఊబర్ ఆల్స్.

ఆశ: మంచినీళ్ళ ప్రాయంగా జర్మను భాషను మాట్లాడేస్తున్నాడు.

భయం: ఆ మాటలకి అర్థం ఏమిటి?

ఆశ: మాటలేవైనా ఫలితం ప్రధానం. తునా తుని యలై పోయింది శతృనౌక.

భయం: ముప్ఫై అయిదు వేల టన్నుల యుద్ధనౌక.

ఆశ: సముద్రంలో హాలాహలం లాగ అగ్ని బయల్దే రింది. యుద్ధనౌకలోని నావికులు ప్రాణాలను దక్కించుకుందా మని చిన్న చిన్న పడవల మీద పారిపోతున్నారు.

భయం: పాపం. వాళ్ళనైనా బతక నిచ్చాడా కమాండర్ కోనేట్.

ఆశ: వీలు లేదు. యుద్ధం యుద్ధమే. శత్రు నావికుల మీదమెషీన్‌గన్లు పేల్చమని తనతరఫువారికిఆర్డర్లుఇస్తున్నాడు.

కోనేటి: (నిద్రలో) ఫోల్కి—షేర్ బియో బాక్టర్! గెహెన్నా. ఆఖ్‌టుంగ్. జైట్ గైస్టు! మైన్ క్యాంప్.

(పిల్లి పాలగిన్నెను పడతోసిన చప్పుడు. తుళ్ళిపడి లేస్తాడు కోనేటిరావు)

కోనేటి: అబ్బబ్బబ్బబ్బ. ఏమిటా చప్పుడు? ఇక నాకు నిద్ర పట్ట నివ్వరకండి.

భార్య: మరేం లేదు. పిల్లి పాలన్నీ వొలక బోసింది.

కో: నువ్వు మేలుకునే ఉన్నావ్? అయిందేదో అయింది. పడుక్కుంటాను. మరినన్ను మాటాడించకు.

క్షణం నిశ్శబ్దం—గురు.

భయం: అసలీ కోనేటిరావెవరు?

ఆశ: అనంతకోటి కచేరీలలో ఒక గుమాస్తా.

భయం: అనధికారరీత్యా అతనికేమీ హోదాలేదా?

ఆశ: కోనేటిరావు అందరిలోనూ, అందరిలాగే ఒక మానవుడు. సంసారి. పెళ్ళాన్నీ పిల్లల్నీ ప్రేమిస్తాడు. కాని తరుచూ వాళ్ళమీదా, తనమీదా విసుక్కుంటాడు. అతని జీవితంలో స్మరించదగ్గ సంఘటనలేవీ లేవు. సాహిత్యరంగంలో అతనికి నాయకత్వంలేదు. పత్రికలలో అతనిపేరు కనబడదు. ప్రపంచంలో అతనిపేరు వినబడదు. అతని నిజమైన జీవితం ఒక స్వప్నం. అతని స్వప్నం ఎన్నడూ సాధ్యంకాని అబద్ధం.

భయం: నాకు చాలా జాలిగా వుంది.

ఆశ: నీ దొంగవేషాలు కట్టిపెట్టు. కోనేటిరావును నువ్వే ఈ దుస్థితికి తీసుకొచ్చావు.

భయం: నేనా ?

ఆశ. నువ్వుకాక మరెవ్వరు? నువ్వతని భయానివి. తన నీడను చూసి తానుభయపడే దుస్థితిలో పెట్టావతణ్ణి. జీతంతో జీవితాన్ని కొలిస్తే బాకీలు మిగిలిపోగా అప్పులవాళ్ళు తప్ప మరెవ్వరూ అతనికి కనబడడం మానేస్తున్నారు.

భయం. నువ్వేం తక్కువ తిన్నావు. లేనిపోని ఆశలతనిలో రేకిస్తున్నావు. అవెన్నటికీ సాధ్యం కానివని నువ్వే ఒప్పుకుంటున్నావు.

ఆశ. మానవుడు కలలు కనడం మానలేదు. కోనేటి రావు జీవితంలో అవి ఫలింపక పోవచ్చును. మరో జీవితంలో. ఇంకో కాలంలో మానవజాతి తన స్వప్నాలను సాధించ గలుగుతుంది.

ఆశ. కోనేటిరావు కథానాయకుడుగా సినిమాలో నటిస్తున్నాడు.

భయం. యాభైయేళ్ళ కోనేటిరావు.

ఆశ. కలలో కోనేటిరావు వయస్సు పాతికేళ్ళే. బహుశా ఇంకా తక్కువ. కలలో కోనేటిరావు స్థూలకాయుడు కాడు. ఆజాను బాహువు. సౌందర్య పరమత్స్యలాంఛనుడు. కళా సర్వజ్ఞుడు కూడాను.

భయం: కథానాయిక ఎవరు?

ఆశ: అతని స్వప్నసుందరి.

భయం: ఆమెకూడా అందమైనదేనా?

ఆశ: మెల్లిగా అడుగుతున్నావా? నువ్వు సినిమా లెప్పుడూ చూసినట్లులేదు.

భయం: అంత అందమైనదా? ఆతర్వాత ఏంజరిగింది?

ఆశ: కథానాయిక అనేకమైన యిబ్బందులలో అరణ్యాలలో-భయంకర మృగాలమధ్య, నగరాలలో భయంకర పరిస్థితుల మధ్య చిక్కుకుంటుంది. ఆమెను కథానాయకుడు రక్షిస్తాడు. వాళ్ళు పరస్పరం ప్రేమించు కుంటారు.

భయం: నేను మొదలే అనుకున్నాను, అటువంటి ప్రమాదమేదో తటస్థిస్తుందని.

ఆశ: అది ప్రమాదం అనుకోవడం నీ బుద్ధి తక్కువ.

భయం: నేను కూడా తిట్టగలను.

ఆశ: ఔనౌను, నీ సంగతి నాకు తెలుసు.

భయం. తెల్లారి పోతోంది, నాయికా నాయకు లేమ య్యారో చెప్పు.

ఆశ: సౌందర్యం సమక్షంలో కోనేటిరావు నిలుచున్నాడు. అతని హృదయంలో ప్రేమ సంగీత రూపంలో ప్రవహిస్తోంది. కథానాయిక అతని ప్రేమన్ని గానంతో అంగీకరించింది. కథలో అతడే సత్యవంతుడు, ఆమె సావిత్రి. అతడు రోమియో, ఆమె జూలియట్. అతడు కోనేటిరావు, ఆమె కోనేటిరాణి.

భయం. వాళ్ళు పాడుతున్నా రన్నావు. నా కేమీ వినబడలేదు. ఆశ. నా చెవులతో విను.

"విడువకోయీ నన్ను వీర రాజ కుమారా."

భయం. కోనేటిరావు తండ్రిపేరు వీర్రాజు పంతులని కథానాయిక కెలా తెలిసింది. ఆశ. అదేమజా. సినిమా కవిత్వంలో మహత్వంఆలాగే ఉంటుంది.

కథానాయిక. విడువకోయీ.నన్నువీరరాజకుమారా?

కోనేటిరావు. విడుతు నా ప్రాణాలైనా! విడుతునా, నిన్నెన్నడైనా.

కోనేటిరావు కొడుకు. తెల్లారిపోయింది నాన్నా.

భయం. కొండెక్కి పోయింది కోనేటి నిద్ర.

ఆశ. కోనేటి నిద్రలో కోడి కూసింది. (కోడికొక్కొరో కో అని కూస్తుంది.)

---

# జడభరతుడు

(ఒక నాటక రచయిత, నాటక ప్రదర్శకుడూ కలిసి, జడభరతుడు అను పౌరాణిక గాథను నాటక రూపంగా ప్రదర్శించడానికి గల అవకాశాలను పరిశీలిస్తారు.)

కవి. నేనో నాటకం వ్రాశాను.

డైరెక్టరు. శుభం.

కవి. మీరు దాన్ని ప్రదర్శించాలి.

డైరెక్టరు. చూదాం.

కవి. అలాకాదు. ఇప్పుడే రిహార్సలు ప్రారంభించాలి.

డైరె. అమాంతంగా అంత మంచి నాటకం రాసి పారేశా రేమిటి?

కవి. నేనెందుకు చెప్పుకోవడం? వింటేమీకే తెలుస్తుంది

డైరె. వినిపిస్తారా?

కవి. కాదు, మీ నటీనటులను పిలిపించండి. రిహార్సలు ప్రారంభిద్దాం.

డైరె. అంతా యిక్కడే ఉన్నారు. కాని మీ నాటకం ఏ రకానికి చెందినది?

కవి. మేలు రకానికి.

డైరె. అది కాదయ్యా, కథ పౌరాణికమా? చరిత్రాత్మకమా? సాంఘికమా? లేక ఇప్పుడు వస్తూన్న జానపద చిత్రాల్లాగ ఏ కాలానికీ చెందనిదా?

కవి పౌరాణికమనే చెప్పవచ్చును. కాని, చాలా వరకు స్వకపోల కల్పితం. ఇందలి పాత్రలు ఏ వ్యక్తినీ మనస్సులో పెట్టుకొని ప్రవేశపెట్టబడలేదు. సంఘటనలు ఏ ఉద్యమాన్ని హేళన చెయ్యడానికి ఉద్దేశించినవి కావు. ఈ మాటలు మొదటే పెద్దక్షరాలతో రాశాను. నాటకం వేసినప్పుడు బిగ్గరగా మీరు ప్రకటించాలి.

డైరె. అంత అవసరమా?

కవి. విధిగా! ఎంచేతనంటే ఇందులో అన్ని సంస్థలని ఏకి పారేశాను. ముఖ్యంగా ఈ విప్లవ వాదుల్ని—

డైరె. పౌరాణిక నాటకంలో రాజకీయాలేమిటయ్యా?

కవి. అక్కడే ఉంది గొప్ప.

డైరె. నేటి సంఘాన్ని విమర్శించడమే మీ ఉద్దేశమైతే ఈ నాటి కథావస్తువునే తీసుకొని రాయవచ్చునే.

కవి. పౌరాణికంలో కొన్ని సదుపాయాలున్నాయి. ఎలా రాసినా మనల్ని అడిగే వాడుండడు. మరి జాప్యం చెయ్యక ప్రారంభిద్దాం.

డైరె. కానియ్యండి. అన్నట్లు మీ నాటకం పేరు చెప్పారు కాదు.

కవి. జడభరతుడు.

డైరె. భాగవతంలోని జడభరతోపాఖ్యానమా?

కవి. భాగవతంలోది తీసిరాసేస్తే నా గొప్పేముంటుంది? స్వకపోల కల్పితమని చెప్పేను కానూ?

డైరె. సరే, ఇక ప్రారంభించండి.

కవి. జడభరతుడు, పౌరాణిక నాటిక, కథాకాలం

త్రేతాయుగం, స్థలంఆర్యావర్తం, ఒకపట్టణంలో చీకటిరాత్రి.

డైరె: ఆ పట్టణానికి పేరేమీలేమూ?

కవి: ఊరిపేరెందుకు లెద్దురూ? అంతగా కావలిస్తే తర్వాత చేర్చవచ్చు. పేర్లకేం కొదవా? బోలెడున్నాయి.

డైరె: ఒక్కటి చెప్పండి.

కవి; ఉన్నపాటున జ్ఞాపకం రాలేదు. తర్వాతచూసుకుందాం అన్నాను కాదూ?

డైరె: "సానుమంతం" అంటే ఎలా ఉంటుంది?

కవి: ఎలా వుండడమేమిటి? ఏదో ఒకపేరు, సానుమంతమే అందాం. ఇక మరి అడ్డుపడకండి, మళ్ళీ ప్రారంభిస్తున్నాను. (ప్రకటింపు గొంతుకతో)

జడభరతుడు పౌరాణిక నాటకం. కాలం త్రేతాయుగం, స్థలంఆర్యావర్తం, ఊఁప వూరన్నారూ? సానుమంతం అబ్బే బాగులేదు పేరు! ఆర్యావర్తమున బ్రహ్మపుత్రానదీ తీరమందున్న...(ఆలోచించి) సరే కానియ్యండి...సానుమంతపురం, చీకటిరాత్రి. ప్రజలంతా నిద్రపోయారు. కావలివాడు గస్తీ తిరుగు తున్నాడు.

కావలి: హొరాహుష్యార్ బహుపరాక్! ఆ రోజులే వేరు, ఆ మనుష్యులే వేరు. జీవిస్తే కృతయుగంలోనే జీవించాలి. అప్పుడు ధర్మం నాలుగు పాదాలమీద నడిచేది. ఇప్పుడో అధర్మం అమితంగా ప్రబలిపోయింది. ఆ రోజుల్లో ఎవ్వరూ అబద్ధాలాడేవారు కారు, ఎక్కడా దొంగతనాలుండేవికావు, యిప్పుడో (గట్టిగా) దొంగలున్నారు జాగ్రత్త.

డ్రైవరు: చాలా పెద్ద స్వగతంతో ప్రారంభించారే.

కవి: స్వగతాలు మీ కిష్టం లేనట్టుంది. నేటి కొత్త టెక్నిక్‌లలో పడి మన ప్రాచీన సాంప్రదాయాలన్నీ మరచి పోతున్నాం. స్వగతం, విష్కంభం, ఈమహామృగం ఇలాంటివన్నీ

డ్రై: ఈ మహామృగం దశవిధ రూపకాలలో ఒకటి కాబోలు?

కవి: మీకు సంస్కృత లక్షణం కూడా తెలుసూ?

డ్రై: వేళయి పోతోంది. ఆ స్వగతం తాలూకు సారాంశం ఏదో చెప్పి తర్వాత రంగానికి రండి.

కవి: అలా దాటేస్తే ఎలాగండీ?

డ్రై: ఆ కాగితాలు ఇలా ఇవ్వండి నేను నడిపిస్తాను. నాటకంలో కావలసిన ముక్క ఒక్కటీ పోకుండా ఉంటే మీకు చాలుకద.

(ఆయన ప్రకటించును)

కావలివాడు రాత్రి నాలుగు జాములూ, నాలుగు సార్లు దొంగలున్నారు జాగ్రత్త అని హెచ్చరిస్తూ ప్రజల ఆస్తి పాస్తులు రక్షిస్తూ ఉంటాడు. ఆ రోజుల్లో ధర్మం మూడు పాదాల మీద నడిచేది కాబట్టి ఇలా హెచ్చరికలు జరుగు తున్నంత కాలం ఏ దొంగతనాలూ, అరాజకాలూ సంభ వించేవి కావు. అయితే గస్తీ ఉద్యోగస్థుడికి మాత్రం ఒక్క రాత్రికూడా తీరుబాటుండేది కాదు. ప్రతిరాత్రీ పని గట్టుకొని ఊరంతా చుట్టవలసిందే.

కవి: అదీ ముఖ్యమైన పాయింటు ఏదీకాన్నీ, నాయనా నీవు చదువు!

కావలి: పదేళ్లుగా పనిచేస్తున్నాను. ఒక రోజా రెండు రోజులా? ఎవరికీ నామీద జాలిలేదు. అయినా ఈ కాలంలో స్వార్థం ముదిరిపోయింది. పోనీ పాపమని, ఒక్కరాత్రి నా బదులు ఈ నాలుగు కేకలు వేసే మనిషి ఒక్కడులేడు. రోజూ నేనే గొంతు చించుకోవాలి. (గట్టిగా) దొంగ లున్నారు జాగ్రత్త.

కవి: (ఉత్సాహంగా) త్రేతాయుగం కాబట్టి సరిపో యింది: కావలివాడు ఎంత బాధపడ్డా లోలోపల నేగాని పైకి మాత్రం తన యిబ్బందులు ప్రకటించడు. ఈ రోజుల్లోలాగ కావలివాళ్ళ సంఘం ఒకటి లేవదిసి సమ్మె అయుధాన్ని ప్రయోగిస్తానని బెదిరించి తన కనీసపు కోరికలను రాబట్టు కోడు. ఇవన్నీ చాలా మజాగా అర్థ్యా చేశాను. ముందు ముందు చూస్తారుగా.

డై: తెలిసీ తెలియని చెత్తంతా రాసి నానెత్తి కొడితే ఏంలాభం? మీ రాజకీయాభిప్రాయాలన్నీ ఇరికించడాని కిదా స్థలం?

కవి: మీకు అతివాదం అంటే ఇష్టం లాగుంది. అయితే మీకనుకూలంగా మార్చేస్తాను; తెండికథ!

డై: అసలు మీరు కథతో సంబంధం లేకుండా రాజకీయాలు తీసుకు రావడ మెందుకంటా?

కవి: సంబంధం కుదిరింది. భేష్, బాగా స్ఫురించింది. మీకు మంచి అనుకూలమైన మార్పు. అయితే అది ఆఖరికి అట్టే పెడుతున్నాను.

డై: సరే అప్పుడు చూదాంలెండి. కథ కానిస్తున్నాను.

కవి: మీరు చాలా సంతోషిస్తారు, జడభరతుడి వేదాంతం విని రాజుగారు తాము తలపెట్టిన దండయాత్రను విరమించి, అహింసా సిద్ధాంతం అవలంబించి, కార్మికుడికి అనుకూలంగా ఒక ముఖ్యమైన శాసనం చేస్తారు.

డై: ఇదంతా ఇప్పుడే ఆలోచించారా?

కవి: ఇప్పుడే ఈ కిందటి క్షణమే. భేష్, చాలా బాగా కుదిరింది. నాటకానికి ఆ ముగింపు చాలా బాగుంటుంది. మీకు నచ్చిన ముగింపు అంతేనా?

డై: పౌరాణిక నాటకంలో పిడకల వేట.

కవి: అంత వేళాకోళానికి తగను. నా నాటకం స్టేజికీ, రేడియోకీ, సినిమాకీ పనికొస్తుంది. డైరెక్టరు గారూ! నా నాటకాన్ని ఫిల్ముకి తీయించరూ?

డై: చూదాం. మొదట ప్రస్తుత కథ కానియ్యండి. మీరే, ఇదుగో కాగితాలు.

కవి: ఊఁ. యెంతవరకు వచ్చాం. మొదట్లోనే వున్నాం కాదూ. కావలివాడు గస్తీ తిరుగుతున్నాడు. దొంగలున్నారు జాగ్రత్త అని ఇప్పటి కెన్నిమార్లు అంటాడు? రెండుమార్లు, ఎవరైనా ఒక్కరాత్రి తనస్థానే పనిచేస్తే బాగుండు ననుకుంటాడు. ఏంచేతనంటే:

కావలి: పదేళ్ళు ప్రతీరాత్రీ పారా యిస్తున్నాను. నాలుగేళ్ళయింది. పెళ్ళిచేసుకొని! కూతుర్ని తీసుకెళ్ళమని మా మామగారు నెల నెలకీ కబురు చేస్తాడు. ఏం చెయ్యను. ఈ ఉద్యోగమో. (అరుస్తాడు) దొంగలున్నారు జాగ్రత్త. అబ్బ, ఏంచలి. కృతయుగంలో యింత చలివుండేది కాదను

కుంటాను. త్రేతాయుగం వచ్చేసింది. కాలం మండిపోతోంది. అబ్బ, నిద్ర! కళ్ళుమండి పోతున్నాయి. అయినా నిద్రపో కూడదు. ఎక్కడేనా కాస్త టీ దొరికితే బాగుండును.

డై: కవిగారూ నిజంగా టీ కావాలని పించారూ వాడిచేత?

కవి: ఏం యెందుకనిపించ గూడదు?

డై: త్రేతాయుగంలో తేయాకేమిటయ్యా

కవి: దానికేం? ఇప్పుడు మన సినిమాల్లో ఇటువంటి మజాలెన్ని లేవు? వుండనివ్వండి. యింకా యెక్కువబాగుండా లంటే వాడిచేత బీడీ కూడా కాల్పిస్తాను. టీ దుకాణం సీను మంచి రక్తి కడుతుంది.

డై: నామాట విని తేనీటి ఘట్టం వదలి పెట్టండి. మీకు మరి లేకపోతే నా__నా వుండాలి.

కవి: త్రేతాయుగంలో తేనీరుండ కూడదనా మీ అభిప్రాయం? యద్దృశ్యం తన్నశ్యం అని ప్రాచీనోక్తి. అంటే నశ్యం వేదకాలం నుంచీ వుందన్న మాట. పొగాకు తేయాకుకి తమ్ముడు. అన్న వయస్సు తమ్ముడు వయస్సుకంటె ఎప్పుడూ యెక్కువే కాబట్టి పొగాకు కన్న తేయాకు ప్రాచీనమైనది! ఉండనివ్వండి. డైరెక్టరుగారూ, అద్భుతంగా సమర్థించాను.

డై: తేనీటి భాగోతం ఉపసంహరించుకునే ఉద్దేశం లేకపోతే మీ కాగితాలు పట్టుకొని మీరు వెళ్ళిపో వచ్చును.

కవి: కోపం వచ్చినట్టుంది. మీకు కోపంవస్తే ఆగ గలమా? మీ యిష్టమే కానియ్యండి. ఎలాగయినా నా

నాటకం ఆడిస్తే చాలు. పదిపేజీలు, దాటేస్తున్నాను.

డై: కవిగారూ, చిన్నమాట. కావలివాడు పేరు జడభరతుడేనా!

కవి: కావలి వాడిపేరు కావలివాడే. రాజుగారిపేరు రాజుగారే, వీళ్ళకి పేర్లెందుకు?

డై: అలాకాదు; ఆనవాలు కేదయినా ఒక పేరు అవసరం.

కవి: అయితే ఆ నామకరణమేదో మీరేచేసెయ్యండి.

డై: ఆర్య వీరసేనుడు.

కవి. అదిరాజుగారి పేరుకి బాగుంది, అంతమంచిపేరు కావలి వాడిమీద ఖర్చు పెట్టడం నా కిష్టం లేదు.

డై: త్రేతాయుగంలో అందరూ అందమైన పేర్లే ధరిస్తారు. రాజుగారికి శ్యేనకేతుడనే పేరు పెడతున్నాను. ప్రస్తుతం ఆర్య వీరసేనుడి కథ కానియ్యండి. జడభరతుడింకా ఎంత దూరంలో ఉన్నాడు?

కవి: తృతీయాంకంలో వస్తాడు. కాని ఏమీ మాట్లాడడు.

డై: అదేమిటి?

కవి: ఆర్య వీరసేనుడు తన ఉద్యోగం ఒక్కరాత్రి మాత్రం నిర్వహించమని జడభరతుణ్ణి వేడుకుంటాడు. జడభరతుడు అంగీకరిస్తాడు లెండి. కాని, సంభాషణ మాత్రం ఒక్క ఆర్యవీరసేనుడే సాగిస్తాడు. జడభరతుడేమీ మాట్లాడడు. ఇది స్ప్రింగ్ బర్గ్ టెక్నిక్.

డై: స్ట్రిండ్ బర్గ్ టెక్నిక్ అని నాకుజ్ఞాపకం. సరే ఇక

కథ అందుతుందాం?

కవి: ఆర్యవీరసేనుడు ఇంతవరకు దొంగ లున్నారు జాగ్రత్త అని ఎన్ని మార్లంటాడు?

కావలి: మూడు మార్లరిచానండి.

కవి: అంటే మూడుయామాలు గడిచాయన్నమాట. నాలుగో సారి, నేను రాసినదాని ప్రకారం టీ దుకాణంలోంచి బైటికి వచ్చి అరవాలి. ఆ ఘట్టం కత్తిరించేస్తున్నాం కదా, ఏం సాధనం?

డై: మరీ యింత చాదస్తమేమిటయ్యా నీకు? చూచాయగా సూచించి వదలెయ్యాలి గాని అర్థంలేని పునరుక్తులతో కాగితాలు నింపితే నటీనటులు కూనీఅయిపోరూ?

కవి: నాలుగుమార్లు అరవడం కథకి చాలా అవసరం, నాలుగు యామాల్లో నాలుగుమార్లు! మున్ముందుజడభరతుడు నాల్గు యామాల్లో నాలుగు శ్లోకాలు చదువుతాడు.

డై: మీ కథకి కాళ్లేమిటి? చేతులేమిటి? రాత్రిని మూడు యామాలుగా విభజించండి.

కవి: అయితే జడభరతుడు చేత మూడు శ్లోకాలే చదివించాలి.

డై: ఎవరయ్యా ఈ జడభరతుడు? ఎప్పటికీ ఈయన దర్శనం కాదే?

కవి: అయ్యో తొందరా అని, కథని ఒక క్రమంలో సాగనిస్తారా?

డై: మీదే ఆలస్యం.

కవి: ఆర్యవీరసేనుడు తెల్లారగట్ల ఇంటికి వెళ్ళగానే

అతని భార్య అక్కడ ఉంటుంది.

డై: పుట్టింట్లో ఉందేమో?

కవి: అదే ఆశ్చర్యం. మొదటిరంగం అయిన తర్వాత ప్రేక్షకులు కూడా ఆర్యవీర సేనుడి భార్య పుట్టింట్లో నే ఉందనుకుంటారు. కాని ఆమె పరమ పతివ్రత కాబట్టి తండ్రితో పోరాడి భర్తృగృహం చేరుకుంటుంది. దారిలో అనేక కష్టాలామెను ఎదుర్కొంటాయి. అవన్నీ భర్తతో చెప్పుకుంటుంది. ఈ రంగం చాలా బాగా రాశానండీ. మీ రేమంటే అనండిగాని.

డై: (చప్పుడుగా నవ్వుతూ) రంగం ఆర్యవీర సేనుడి యిల్లు. గస్తీ తిరగడం ముగించుకొని ఆర్యవీర సేనుడు ఇంటికి వస్తాడు. అతని భార్య—ఈవిడకికూడా ఏం పేరూ లేదే. ఈమెకీ నేనే నామకరణం చెయ్యాలి కాబోలు. ఆర్యవీర సేనుడి భార్య ఆర్య—

కవి: చాలు, ఆర్య. అంతకంటె పెద్దపేరు వద్దు. అనవసరంగా ఆడవాళ్ళకి పెద్దపేర్లు ఇచ్చెయ్యడం కలికాలపు దురలవాటు.

డై: ఆర్యవీర సేనుడు, ఇంటికి వస్తాడు. అతని భార్య అప్పుడే పొయ్యరాజవేసి నీళ్ళు కాగ పెడుతోంది.

కవి: వీరుడు స్నానం చెయ్యడానికా?

డై: కాదు, కాఫీ కలపడానికి, పోనీ మీ కిష్టమైన తేనీరు తయారు చెయ్య—

కవి: అదుగో, మళ్ళీ తేనీటి గొడవెందుకండీ: అది మానేద్దాం, అనుకున్నాం కాదూ? మీరు కొంతసేపు ఊరు

కొంకురూ. నేనే డైరెక్టు చేస్తాను. ఆ కాగితాలిలా యివ్వండి. కావలివాడు ఇంటికి రాగానే భార్య కనబడుతుంది. కావలి వాడు ఆశ్చర్యంతో—

కావలి: ఆశ్చర్యం, ఎవరమ్మాయి నువ్వు?

ఆర్య: ప్రాణేశ్వరా, నన్ను పోల్చుకోలేదా?

కావలి: నా ప్రేయసి! నేడెంత సుదినం. కాని ప్రేయసీ ఇక్కడి కెలా వచ్చేశావు?

ఆర్య: మానపతియగు భారతసతికి ప్రాణపతి సన్నిధానమే పెన్నిధానము కదా?

కవి: సెబాస్. చాలా బాగుంది! మళ్ళీ అను తల్లీ ఆ మాటలు!

ఆర్య: (తడబడిపోయి) ప్రాణపతియగు భారతసతికి—

డై: కట్. అందుకే ఒన్సుమోరు అనరక మంటారు. ఇదుగో కవీ, ఇలా విను. నీ నాటకానికి నువ్వే పొంగిపోతూ మధ్య మధ్యని జొరబడుతూ వుంటే లాభంలేదు. నిజంగా యీ డైలాగు చాలా బాగుందనే నీ వుద్దేశమా? ఆ అమ్మాయిచేత అంత కఠినమైన గ్రాంథికభాష మాట్లాడించడ మెందుకూ?

కవి: పౌరాణిక నాటకంలో గ్రాంథికభాష ప్రయోగించక పోతే ప్రౌఢత్వం సిద్ధించదు.

డై: మరి కావలివాడిచేత వాడుకభాష మాట్లాడించావేం?

కవి: పాత్రోచిత భాష సంప్రదాయ సమ్మతమే.

డై: మరి ఆ పాత్రోచిత భాష అతని భార్యకి కూడా ఎందుకు వాడలేదు? సంస్కృత కవులంతా స్త్రీ పాత్రలచేత ప్రాకృతం మాట్లాడిస్తారే?

కవి: నన్నిలా క్రాసెగ్జామినేషను చేస్తే బతకలేను, కావలివాడి భార్య మహా పతివ్రత. ఆమెయొక్క ఉదాత్త భావాలను యింకోవిధంగా చెప్పించడానికి వీలులేదు.

డై: ఇంతకీ మీా నాటకం, నేనేవో సలహాలుమాత్రం యిస్తాను. అంతకంటె ఏం చెయ్యగలను?

కవి: మంచి సలహాలు నేను స్వీకరించ నన్నానా? మిమ్మల్ని మెప్పించడానికి టీ దుకాణం ఎత్తేశాను కాదూ?

డై: కథ కానిద్దాం.

కవి: తొలినుంచీ మొదలు పెట్టాలి.

డై: మళ్ళీ మొదటికి రావలసిందే?

కవి: రెండో సీనండీ! కావలి వాడు ఆశ్చర్యంతో.

కావలి: ఆశ్చర్యం, ఎవరమ్మా యీా నువ్వు?

డై: ఇందులో ఆశ్చర్య మేమీాలేదు.

కవి: కాస్సేపూరుకోండి మీారు. ఊఁ కానీఅమ్మాయి.

ఆర్య: ప్రాణేశ్వరా, నన్ను పోల్చుకొన లేదా?

కావలి: నా ప్రియసీ! నేడెంతసుదినం. కానీ ప్రేయసీ ఇక్కడి కెలా వచ్చావు?

ఆర్య: (భయంతో) ప్రాణపతియగు మానవసతికి——

డ్రై: కట్. కవిగారూ, గులకరాళ్ళలాంటి ఈ భాషని మీరు యిక నెప్పుడూ వాడనని ప్రమాణం చేస్తారూ?

కవి: అమ్మో ఘోషా ఇదో పెద్ద కష్టమటండీ?

డ్రై: ఏదీ, ఒకమారు మీరావాక్యంఅనండి,చూదాం.

కవి: (వైభవంగా) మానవతి యగు భారత సతికి ప్రాణపతి సన్నిధానమే పెన్నిధానము కదా.

డ్రైరే: సాధించారు ఎలాగైతేనే? కాని ఇలా చూడండి నాలుగు సార్లు గబ గబ—గుక్క తిప్పుకోకుండా గంగమ్మ, గంగమ్మ, గంపగంగమ్మ, అనండి చూదాం.

కవి: అన్నా, పెంకితనం నన్నో చిన్న పిల్లణ్ణి చేసి ఆడిం చేస్తున్నారే.

---

# ఒంటరిబావి

కథన కంఠం (౧)

నోరావులించి
ఊరికి దూరాన పొంచి
నీరింకిపోయి నిలుచుందొక ఒంటరిబావి:
దారుణములైన కథలున్నవిదానిగురించి!
చెప్పనా, చెప్పనా ఆబావి గురించి?
విప్పనా, విప్పనా నా విషాల సంచి?

సంభాషణ—ఆఁ. ఏమైంది? ఏమిటి సంగతి? ఊరుకో, మాట్లాడకు ఊరికే విను.

కథన కంఠం (౧)

భూతాలూ, బేతాళాలూ వాగుడు
మూతలాడుతాయా నూతిలోతులో
పాతాళ లోకానికి పావంచాలా
నుతి దిగువనే ఉన్నాయట !
చెప్పనా ఇప్పుడే ఆ నూతిగురించి?
ఇప్పుడే, అంతా వినండి శ్రద్ధవహించి.

సంభాషణ—ఏ వూళ్ళో ఏ కొసని? ఎప్పుడు? ఏం సంగతి? ఊరుకో, మాట్లాడకు ఊరికే విను.

కథన కంఠం (౧)

ఊరావరించి ఒకటే
ఆకాశమంతగా ఆవులించి

అగాధ దారుణగాథ లెన్నెన్నో దాచినబావి.
వినిపించనా మరి ఆ బావిగురించి?
సవరించనా ఇక నా భీకర బీభత్సవిపంచి?

సంబాషణ—అయితే, మరి...? చప్, చుప్ రహో.

కథన కంఠం (౧)

జీబుగా చీదరగా ఎన్నో
చెట్లూ చేమలూ దాని నిండా,
శాఖోపశాఖలుగా విస్తరిల్లి
కాశీమజిలీ కథల్లాగ,
ఆనూతినోట ఒక్కొక్క చీకటిపూట
నే విన్నపాట ఒక కొన్ని ప్రపదశ్రీవాల మూట!
ఆనూతిలోని చిక్కటి చీకట్లు
కాలం కాలిన పొగవాసన!
అందులోని నిశ్శబ్దం కూడా
అదో మాదిరిగా అరుస్తుంది!
చెప్పనా, చెప్పనా ఆ బావిగురించి?
విప్పనా, విప్పనా నా విషాలసంచి?

కథన కంఠం (౨)

రకరకాలుగా ఒకే కథకు
రంగులు పూశారో యేమో?
రకరకాల నరకాల వికారాలే
రాజ్యం చేస్తాయా నూతిలో!

కథన కంఠం (3)
నాలుగైదు కథలకి ఆబావి
నాటకరంగమో యేమో?
ప్రజల నోళ్ళలోపడి ఆకథలే
బావిరూపు తాల్చాయేమో?
కంఠం(౧) అమాయకురాలి భయంకరమైన అరవు
ఆఖరుసారి విన్నారు ప్రజలు!
ఆనాటి మొదలు ఆనూతి కథలు
ఆనోట ఈనోట అల్లుకుపోయాయి.
ఇప్పటికీ తెలియదా పిల్లని
ఎవరు చంపేశారో?
ఎంతో అందమైన పిల్ల మళ్ళి.
ఎందుకు చంపేశారో?
కంఠం(౨) ఆసిరీ, నరిసీ ఇరుగూ, పొరుగూ:
అరమర లేవీ లేవు.
ఆసిరిగాడికూతుర్ని నరిసిగాడే చంపాడని
అంటూ రంతమందీ.
పదేళ్ళు సుమండీ, ఇంతా చేస్తే
పాపం! అసిరిగాడి కూతురికి!
దాని కాలి కడియాలకోసం
గానీ ఆశించాడు కాబోలు నరిసిగాడు!
కంఠం(౧) లేదా... లేదా... మరేదేనా ఘోరం...
అబ్బే, అలాంటి వాడుకాడు నరిసిగాడు!
ఏమో... ఏమో... ఏ కాలానికేమిబుద్ధులో ?

విచిత్రమైనది మానవ ప్రకృతి.

మగగొంతు: అమ్మో, అమ్మో !

ఆడపిల్లగొంతు: ఏం, నరిసిమాఁవా !

—ఇలా రాయే !

—ఏం, నరిసిమాఁవా ?

—ఇలా రాయే, దగ్గరకీ...

—అదేటిమాఁవా, అలాసూస్తావు?...అఁ. నన్నొదిలెయ్. ఏటా పరాసికాలు? (పరుగు)

—పారిపోతే పట్టుకోలే ననుకున్నావా? దొంగా !

(ఆడగొంతుక అరుపు)

కంఠం(3) పోనీ, అదంతా మన కెందుకుగాని
పోలిగాడి సాక్ష్యం మాటో?

కంఠం (౨)అయినా వాడు మాత్రం విన్నది
అర్ధరాత్రి ఒక అరుపే!

కథన కంఠం (౧)

నరిసిగాడి కూతుగు శవం నూతిలో
దొరకలేదు సుమండీ, ఎంత వెదకినా !
అప్పుడప్పుడు మాత్రం వినిపిస్తుంది.
అరిచే ఆపిల్ల గొంతు !
అదైనా స్పష్టంగా కాదు !
ఆబావిలోంచే అనికూడా అనలేము,
ఎక్కడో వినబడుతుంది ఆ చప్పుడు:
ఎందుకో ఆబావిని చూస్తే అందరికీ భయం !

ఫేడౌట్

## ఆంగ్ల మాతృక

# భూతాల కొలిమి

నేపథ్యంలో వాద్యసంగీతం. ఇళ్ళు తగులబడుతున్నట్లు రాళ్ళు తిరగ బడుతున్నట్టు.

ఒక గొంతుక: అమ్మాయీ! ఏయ్! అమ్మాయీ అదేమిటలా పరుగెత్తుతున్నావు? ఆగవూ? అయ్యో పాపం! ఆగవూ? నా మాటవిను. అమ్మాయి ఆగు! అదేమిటి కాళ్ళ నిండా రక్తం? ఎక్కడ కమ్మాయి ఈపరుగు? ఏముంది ఈ సందు చివర?

స్త్రీకంఠం: భూతాల కొలిమి! పోవాలి నేను.

గొంతుక: వెళ్ళ కమ్మాయీ! విను నా మాట! వినవూ? ఆగవూ? ఏముందక్కడ? ఎందుకాఆరాటం?

స్త్రీ కంఠం :

పొలముగట్లూ దాటి
మలుపులన్నీ తిరిగి
చీరుకొని పోతూన్న పాదాలమంటతో
చిరిగి జీరాడేటి చీర చేబట్టుకొని
ప్రాణాలకు తెగించి
పరుగెత్తుతున్నాను
పోవాలి చేరగా భూతాల కొలిమికి
సందు చివరావున్న భూతాల కొలిమి.

గొంతుక: నిజంగా నీకు మతిపోయినట్టుంది.

స్త్రీ కంఠం:

నిజమేమొ నాకేమొ
మతిపోయెనంటారు
బతుకులో నేదుఃఖాలు
మెదడులో ఖడ్గాలు
కడు భీతి పెనుబాధ
కాల్చికూల్చే వేళ
నాలోనె నేనేమొ
నవ్వుకుంటాను
నాచేతులొకసారి
నములుకుంటాను
కన్నీట రక్తాన్ని కడిగి వేస్తాను
కాకుల్ని గూబల్ని పలుకరిస్తాను
ఆకసంలో గొంతు లాలకిస్తాను
రాత్రిస్వారీపోవు రాకాసిమూకల్ని
రెప్పపాటులేక చూస్తాను—జనం,
దగ్గిరా నేవస్తె తప్పుకుంటారు
పొలము గట్లూ దాటి
మలుపులన్నీ తిరిగి
ప్రాణాలకు తెగించి
పరుగెత్తుతున్నాను
పోవాలి చేరగా భూతాలకొలిమి
సందుచివరాడున్న భూతాలకొలిమి

గొంతుక: ఎందు కమ్మాయీ అక్కడికి? ఏదీకాని వేళ యిప్పుడు? ఎవరుంటా రక్కడ?

నరికి పారేశారు
నా పెన్ని ధానాన్ని
ఏ తప్పుచేశాడో యేపాపమో గాని
నాటినుంచీ నేను
పాటతో కేకతో
మతిలేని గతిలేని
మనిషినై పోయాను
పోవాలి చేరగా భూతాలకొలిమి
సందు చివరావున్న భూతాలకొలిమి

గొంతుక: ఆ ! అయితే? స్త్రీ

నిన్న రాతిరి వేళ
కన్ను తెలియని చిమ్మ
చీకట్లు చీల్చుకొని
నే తిరుగుతుండగా
నమ్మండి నమ్మండి
నాకు కనిపించాడు
భూతాల కొలిమిలో పూలదండనుబోలి
భూతాల కొలిమిలో పుష్యరాగంలాగ
నాకు కనిపించాడు
నావాడు వగకాడు
అందుకే అందుకే

ఆ చోటు చేరగా
బయలుదేరి యిలాగు
పరుగెత్తుతున్నాను
పోవాలి చేరగా భూతాల కొలిమి
సందు చివరావున్న భూతాల కొలిమి

కొలిమి నిప్పులాగ
సెగజిమ్మే కళ్ళతో
మొగమంత పొగచూరి
భగభగా వెలుగగా
నరకలోకంనుంచి నన్నుచూడొచ్చాడు
నమ్మితే నమ్మండి నాకు కనిపించాడు
కెవ్వుమని కేకతో
రివ్వుమని వెళ్ళాను
ఆ ముద్దు నెమ్మోము
నే ముద్దుగొన్నాను
చురికిందినా పెదవి
ఎంచేతనోకాని
ఆ ముద్దులో అంత
అగ్నివుందో యేమొ

పోవాలి చేరగా భూతాల కొలిమి
సందు చివరావున్న భూతాల కొలిమి

మ్మతో ఈ మాట
నె యేడ్చింది

భూతాల కొలిమిలో బొగ్గునిప్పులు తప్ప
చచ్చిపోయిన మనిషి వచ్చి చూస్తాడటే
మంటలో నీడనే
మనిషిగా చూచావు
నిప్పు ముద్దిడి నంత
నీ పెదవి చురికింది
ఎప్పుడూ ఆదారి ఇక నువ్వు తిరగొద్దు
ఇంటిపట్టును వదలి ఎక్కడకు పోవద్దు
పోవద్దు పోవద్దు
వద్దు వద్దన్నాది
అమ్మ చెప్పేమాట నమ్మకండీ మీరు
భూతాల కొలిమిలో నాకు కనిపించాడు
పుష్యరాగంలాగ పుష్పమాల్యంలాగ
భూతాల కొలిమిలో నాకు కనిపించాడు
భూతాల కొలిమిలో నాకు ముద్దిచ్చాడు
అందుకే అందుకే
ఆగనే ఆగకే
పొలము గట్లూ దాటిములుపులన్నీ తిరిగి
చీరుకొని పోతూన్న పాదాలమంటతో
చిరిగి జీరాడేటి చీర చేబట్టుకొని
ప్రాణాలను తెగించి పరుగెత్తుతున్నాను
పోవాలి చేరగా భూతాల కొలిమి
నందు చివరావున్న భూతాల కొలిమి.

# బలి

అవతారిక.

ఒక గొంతుక: బలిచక్రవర్తి రాక్షసరాజు. రాక్షసులు దుర్మార్గులు. బలి ధర్మమూర్తి. దానపరాయణుడు. అంతమంచి వాడు లేడు. ఎంత మంచి వాడంటే తన్ను అర్థింపవచ్చిన వామనుడికి తన సర్వస్వం అర్పించాడు. చాలక తన శిరస్సునే త్రివిక్రమునికి పాదాక్రాంతం చేశాడు. ఫలితం అందుకతనికి పాతాళవాసం. ఇదేనా న్యాయం? బాగుందా భగవంతుడు చేసిన పని.

ఇంకొక గొంతుక: ఇంద్రుడు దేవతల రాజు. దేవతలు చాలా మంచివాళ్ళు: కాని ఇంద్రుడుమాత్రం దుష్టుడు. అతని అసూయకు మితిలేదు. తన పదవిని నిలుపుకోవడానికని అతడవలంబించని కుతంత్రం అంటూలేదు. అప్సరసలని పంపడానికి జంకడు. భగవంతుడి కాళ్ళు పట్టుకుంటాడు. ఇంద్రుడు భోగ లాలసుడు. మునిపత్ని అహల్యను చెరచడానికి సంకోచించనివాడు. అతడు పాపాత్ముడు. అయినా అతడు స్వర్గానికి రాజు. ఇదెక్కడి న్యాయం? అదేనా భగవంతుని నీతి?

మొ. గొం: భగవంతుని న్యాయాన్ని ప్రశ్నించడానికి మనం ఎంతవాళ్ళం?

రెం. గొం: కాదు దీనికేదో కారణం ఉంటుంది.

మూ. గొం: నేనా కారణం చెప్పగలను. బలిచక్రవర్తి స్వయంగా మంచివాడే. కాని అతనిచుట్టూ పాపావుంది. అతడెంత మంచివాడంటే తనచుట్టూవున్న రాక్షసత్వాన్ని కాదనలేడన్నంత మంచివాడు. శుక్రాచార్యుడతని గురువు. ఆయన ఎలాంటి పాపాన్నైనా హేతువాదాలతో సమర్థించగల చతురుడు. బలిచక్రవర్తి తానెంత మంచివాడైనా తనచుట్టూ పాపాన్ని పెరగనిస్తూన్న కారణంవల్ల అధోలోకంలో అతడు నివసించవలసి వచ్చింది, స్వంభావంవల్ల దేవేంద్రుడు చెడ్డవాడైనా తనచుట్టూ పుణ్యమే వుండేటట్టు అతడు జాగ్రత్త పడతాడు. బృహస్పతి అతని గురువు. దేవ్వులందరూ అతని సన్నిహితులు. అందువల్లనే అతడు స్వర్గానికిరాజు.

ఒక. గొం: ఇంతకీ స్వర్గంపద్దో నరకంపద్దో ఎవరు నిర్ణయించగలరు?

రెం. గొం: బాగాఅన్నావు. ఒకస్థలమే ఒక కాలంలో స్వర్గంలా కనపడుతుంది. అదే యింకొక సమయంలోనరకమై పోతుంది.

ఒక. గొం: మంచిచెడ్డల తారతమ్యాన్ని మానవ మాత్రులెలా నిర్ణయించగలరు?

రెం. గొ: బాగాఅన్నావు. ఒకస్థలమే ఒకకాలంలో స్వర్గంలా కనపడుతుంది. అదే యింకొక సమయంలో నరకమై పోతుంది.

ఒక. గొం: మంచిచెడ్డల తారతమ్యాన్ని మానవ మాత్రులెలా నిర్ణయించగలరు? ఒకడిమంచి యింకొకడికిచెడ్డ. ఒకడికి అమృతం యింకొకడికి విషం.

మూ. గొం: కాదు. ఉషస్సంధ్యలు రెండూ ఒకేలాగే వున్నా వెలుతురుకీ చీకటికీ భేదంవుంది. నరకంఅంటే అశాంతి. స్వర్గం అనగా ప్రశాంతి.

మొ. గొం: పాపంలోనే పుణ్యం వుంటుందనడానికి నిదర్శన, పాతాళలోకంలో బలిచక్రవర్తి వుండడమే.

మూ. గొం: ఇప్పుడుమనం పాతాళలోకానికేప్రయాణమై పోతున్నాం తమిస్ర ప్రపంచం.

చీ క టి లో క ం

ఈ రంగం ఒకరకం జంత్రవాద్యాల రోదనగానంతో ప్రారంభమాతుంది. కనబడని గొంతు :

ఈ యింట్లో ఏవరూలేరా,
ఇదేమిటీ విచిత్రగానం?
ఇదేమిటీ తమస్సముద్రం
ఈ యింట్లో ఎవరూలేరా?
దీనిపేరు ఒంటరి తనం
ఇది మన రెండో నైజం
చంద్రుడులేని చీకటివేళ
వెన్నెలకై వెదకకు నేస్తం.
చీపురు పుల్లల గుసగుసలు
చీమల ఏకాంతం
గడియారాల తిరుగుబాటు
కంకాళాళ గలగలలు.
మంటగంటల చప్పుడు

మస్తిష్కంలో నిప్పులు,
ఈ పాతాళాలలో కాంచలాల
ఏవో జీమూత మయూరాలు.
ఏవరయ్యా తలుపు తలుపు
పలకరేం వులకరేం ఎవరూ?
ఎవరూ ఈ యింట్లో లేరా?
ఈ యింటికి తలుపులు లేవా?
ఇవి మరణపు సరిహద్దులా,
జననపు పొలిమేరలా?
పాపపు పరిసరాలా,
పుణ్యపు పరిమళాలా?

ప్రకటన తమం హిమం స్రవిస్తున్నాయిక్కడ
దారిద్ర్యపు దండయాత్ర
భయానక నాటకాలు
తమంలాగ హిమంలాగ
అగ్రహాల విగ్రహాలు
అద్దంలో మన నీడలు
అనాకారంగా ఘోరంగా
ఆవిరులు కావిరులు
నరం నరం రాపాడి
జనం జనం తోపాడి
ప్రభంజనం గుంజనం
హిమం ద్రవం స్రవంతులు

కళ్లు లేళ్ళలా ఏడుస్తాయి, సందేహం
కాళ్ళనుంచి తలదాకా పాకుతుంది
కరిగిపోతున్నాయి సరిహద్దురాళ్లు
కదులుతున్నాయి కాలపు కీళ్ళు
ఈ యింట్లో భయంవాసన
ఎటూ దారితెన్ను లేదు
ఇది రాక్షసపతి రాజధాని
బలిచక్రవర్తి నివాసభూమి.

ఒక. గొం: ఇది పాతాళమా? నరకమా? దీనికీ భూమికీ భేదమే లేదే.

రెం. గొం: ఏదో పెద్దప్రయాణం చేశామనుకున్నాం. ఎక్కడికీ కదలినట్లేలేదే.

మూ. గొం: నడిచినా పరుగెత్తినా నౌకలో వెళ్ళినా ఎవరుమాత్రం ఎక్కడకు పోగలరు? ఎవ్వరూ తమ స్వభావాలనుంచి ఎడంగా పోలేరు.

మొ. గొం: ఎవరో యిటు వస్తున్నారు.

రెం. గొం: ఎవరయ్యానువ్వు.

ఆగం: నేనొక నిర్జీవిని. ఈ ప్రాంతాలలో విహరిస్తూ వుంటాను. ఎప్పుడూ నా స్వభావానికి వెలుపలనే తిరుగుతా

ఒక. గొం; ఇదేదో విచిత్రప్రదేశంలా వుందే. నిర్జీవీ, నీకు కాలక్షేపం ఎలాగ?

నిర్జీవి  ఇది నా జన్మభూమి
ఇదే నా స్మశానం

మరణాన్ని పరుచుకొని
ఒంటరితనాన్ని కప్పుకొని
నిర్లిప్తతను ధరించి
నిస్పృహను వరించి
విరించిని జయించగల
విపంచి నినదించాను
ఇది నా ఇంకొక తనం
నా ఒంటరితనం
అసలేని ఆయాసలేని
విలాస నికేతనం
పురాతనం వినూతనం
ఇది నా జననధాని,
నా మరణ భూమి.



అగమ్యం నా గమ్యం
అమేయం నా ధ్యేయం
అనంతం నా ధ్వాంతం
అశాంతి నా శాంతి.

మీరు మానవలోక వాస్తవ్యుల్లా కనబడుతున్నారు. మీకు బోధపడే భాషలో మాట్లాడుతాను, వినండి.

పాలుతప్ప మరేవీ తాగకుండా
అప్పుడప్పుడు ఉపవాసాలుంటూ
నిజంకనబడితే జడుసుకొని
నీడల్లా బతుకుతారేం?
ఏమిటి సాధించాలని

ఇంత తాపత్రియం మీకు?
ఎప్పుడూ ఏదో పనివున్నట్లు
ఎందుకు తిరుగుతారు మీరు?
ఎవరేం చెప్పినా నమ్ముతారు
చుక్కలలో పేక ముక్కలలో
అరచేతుల గీతలలో
భవిష్యత్తును పఠించబోతారు
ఉప్పెనగా ఉపద్రవం
ఒక్కపెట్టున ముంచెత్తినప్పుడు
దారితెలియక పరుగెత్తుతారు
దారికడ్డుగా దాగుంటారు
నమ్మకాలను కౌగలించుకొని
అమ్మలకాను నమ్ముకొని

ఎవరెలా తిప్పితే అలా అలా గిరగిరా, గిరగిరా
తిరిగి తిరిగి తుదకు సొమ్మసిల్లి పడిపోతారు
కళ్ళకి గంతలూ వెదళ్ళకు దళ్యా కట్టుకుని
కనబడలేదంటారు బోధపడదంటారు

విప్పండి మీ వికారపు వేషం
విశ్వసించండి వివేకాన్ని
సౌందర్యం కావలా మీకు,

స్వాతంత్ర్యమా మీరు కోరేది?
స్వాతంత్ర్యం సాధించాలంటే ఏదీ తెలివి,
సౌందర్యాన్ని సందర్శించే కన్నేదీ?

మీ నాగరికత కొలతలు నా కెరుక
మీ రోగాలకు మందివ్వగలను
కానీ మిమ్మల్ని మీరే రక్షించుకోవాలి,
స్వ స్వరూప జ్ఞానం కావాలి.
మొ. గొం ఈ వేదాంతం వినడానికా
ఇక్కడకు మేము వస్త?
చపట చవక పత్రికా సంపాదకీయపు
చాదస్తపు ధోరణి చాలించు కాస్త
నిర్జీవి నరలోకపు మర్యాదలను
తిరస్కరిస్తున్నావు నీవు
అరవకు అరవకు ఇక్కడ అరిస్తే
మరణం మేలుకుంటుంది
మరణం ఒక మహా యోగానం
జననం అది భవిష్యన్మరణం
నరకం గురించి మీకుగల
దురభిప్రాయాలు తొలగించుకోండి
ఇక్కడ చిత్రవధలు లేవు
వేడినూనె నూతులు లేవు
వాడిగోళ్ళ పిట్టలు లేవు
రంపాలు లేవు. భూకంపాలు లేవు
పాపాన్ని పశ్చాత్తాపంలో ముంచి
పంపించేస్తాం వెంటనే
ఇక్కడ శాశ్వతంగా వసించాలంటే
ఎన్నో అర్హతలు కావాలి

ఉద్యోగం కావాలంటేనే
యోగ్యతా పత్రాలు తేవాలే
నరకంలో చిరనివాసం
పరమ కష్టసాధ్యమని నమ్మండి.
ఇందుకు నేనే ఒక ఉదాహరణ
క్రిక్కిరిసిన దట్టపు తమస్సు
లో నేను చేసిన రాక్షస తపస్సు
నాజనన మరణ చంక్రమణాలసమీకరణ
రెం. గొం అంధకారలోకంలోకూడా నీకు
అహంకారం కరిగిపోలేదు
అయినా వింటాంచెప్పు
ఏమిటో నీవేదన, నీరోదన?
నిర్జీవి మీలాగే నేనూ
భూలోకంలోనే
మానవుడై చాలా
కాలం గడిపాను.
మీలాగే నేనూ
విశ్రాంతులలోనూ
విక్రీడించాను.
మీలాగే నేనూ
తారుణ్యంలోనూ
కారుణ్యంతోనూ
ఆక్రందించాను.
ఈ నాటికి నేను

పేరాసల జీను
వేరే విసిరేను
ఈ రాత్రికి నేను
సారథినైనాను.

సముద్రంఅంత హృదయంనాది ఆకాశమంత నేత్రం
మహానదుల రక్తనాళాలు మహీధరాలకిరీటం నాది
ఎడారులలో నా ఉద్రేకం ఇంకిపోనిచ్చాను
నా నేస్తాలు జలపాతాలు, ఝుం ఝూనిలాలు

రావి చెట్టుక్రింద స్వతంత్రంగా
రాజ్యం చెయ్యడం నేర్చాను,
ఒంటి కాలిమీద నిలబడి
ఊర్ధ్వదృష్టి సారించాను
నా అంత మంచివాడు లేడన్నారంతా,
పత్రికలు నా పాపాలు ప్రకటించాయి,
మంచి చెడ్డల కతీతంగా నా
మనస్సును పదిలపరిచాను.
ఏపనీ చెయ్యకపోవడం అనే
ఎంతో కష్టకిష్ట కార్యం సాధించాను
ఎప్పుడూ ఇప్పుడులోకదుల్తాను
ఎక్కడా ఇక్కడగా చరిస్తాను
సముద్రాల రహస్యాలు గ్రహి[illegible]ను
తమిస్రాల కవిత్వాలు వధిం[illegible]
అసత్యాల అనిత్యాన్ని జ[illegible]

గురుత్వాల లఘుత్వాన్ని గుణించాను
ఖరీదైన గ్రాండ్ హోటల్
కారు చీకటి సినిమా హాల్
రోగాల దేవాలయం హాస్పిటాల్
ఆకాశాన్ని చీల్చుకుపోయే రాకెట్
ఆద్యంతాల నిముడ్చుకొనే బ్రాకెట్
అన్నీ ఈ రసాతలానికి సంకేతాలు
అన్నింట్లో నిరాఘాటంగా నా సంచారాలు

మొ. గొం నిర్జీవితో సంభాషణ
నిష్ప్రయోజనం
ఇతడేం మాట్లాడుతున్నాడో
ఇతనికే తెలియదు

రెం. గొం ఇతడిచ్చిన జాబితాకి
ఇంకొకటి కూడా కలిపితే సరి

మొ. గొం ఏముంది, పిచ్చాసుపత్రి.

నిర్జీవి నిజం చెప్పినందుకు నేస్తం
నిన్నభినందించక తప్పదు
ఉన్మాదం తురీయావస్థ
ఆరాజ్యం కూడా మాకుకప్పం కడుతుంది

రెం. గొం అయితే తమరెల్లప్పుడూ
అక్కడే ఉండి పోవడం మంచిది

మూ. గొం లేదు ఈయన తత్వంలో ఏదో విశేషం ఉంది.
నరకం మీద [illegible] ధికారంగా మాట్లాడుతున్నారు.

నిర్జీవి: కృతజ్ఞుణ్ణి, ఇంకా నేనెన్నో నేర్చుకోవలసిన వున్నాయి. ఇక నేను మీకు కనబడను. అటు చూడండి ఆ తేజస్సును. అతడే బలిచక్రవర్తి.

మొ. గొం: నిర్జీవి మాయమైపోయాడు.

రెం. గొం: బలిచక్రవర్తి ప్రసన్నరూపాన్ని చూడు. స్వర్గధామాన్ని పరిపాలించ వలసిన సౌమ్యత్వం ఆయనలో మూర్తీభవించింది, ఆయన సమీపిస్తూ ఉంటే శరీరం గగుర్పొడుస్తోంది. నమస్కరించాలని బుద్ధిపుడుతోంది.

బలిచ: వద్దు, వద్దు, నాకు నమస్కరించకండి. ఒకప్పుడు నేను సమస్త లోకాలనూ జయించాను. దేవేంద్రున్ని స్వర్గనుంచి తరిమివేశాను. ఐశ్వర్యాన్ని రుచిచూశాను. ఆనందాల లోతులు చూశాను. ఇప్పుడు నా కంతా సమానం. అందరినీ ఒక్కలాగే చూడగలుగు తున్నాను.

మొ. గొం: మీరు పరమ ధర్మస్వరూపులు. సర్వ సమానతత్వాన్ని సాధించారు. మీరెక్కడవుంటే అదేస్వర్గం.

బలి: లేదు. ఈ పాతాళలోకాన్ని నేను విడిచిపెట్ట లేను. పాపాత్ములను ఆర్ధంచేసుకోవడానికి ప్రయత్నిస్తున్నాను. పతితులను బోధపరచు కుంటున్నాను.

రెం గొం: ఆశ్చర్యం. సమస్త లోకాలనూ జయించిన బలిచక్రవర్తి అధఃప్రపంచాల అంధకారానికి బలికావడం.

మూ గొం: ఆకథ వినాలని వుందా? అయితే కృత యుగంలోకి వెళ్ళాలి.

ఫేడవుట్

## వామనమూర్త్యావిర్భావ ఘట్టం.

ప్రకటన రవిమధ్యాహ్నమునం జరింప, గ్రహతారాచంద్ర
భద్రస్థితిన్

శ్రవణద్వాదశినాడు శ్రోణనభిజిత్సంజ్ఞాత లగ్నంబునన్
భువనాధీశుడు పెట్టె వామనగతిన్ బుణ్యావ్రతోపేతమున్
దివిజాధీశ్వరమాతకుం బరమపాతివ్రత్య విఖ్యాతమున్.
భిక్షా పాత్రిక నిచ్చెను
యక్షేశుడు వామనునకు నక్షయమనుచున్
సాక్షాత్కరించి పెట్టెను
భిక్షునకు భవాని పూర్ణభిక్షన్ బ్రీతిన్.
ప్రక్షీణ దివిజ వల్లభ
రక్షా పరతంత్రుడగుచు రాజీవాక్షుం
డాక్షణమున బలియింటికి
భిక్షా గమనంబు నేసె బేదరికముతోన్.

ఆమాయామాణవకుడు హయమేధ మఖాంతర్వేది
కావాటమున

దానవేంద్రునిగాంచి—కుశపవిత్రాక్షత సంయుతంబగు
దక్షిణ హస్తంబువాచి—

వామన స్వస్తి జగత్త్రయీభువన శాసనకర్తకు, హాసమాత్రవి
ధ్వస్త నిలింపభర్తకు,నుదారపద వ్యవహర్తకున్,మునీం
ద్రస్తుత మంగళాధ్వర విధానవిహర్తకు, నిర్జరీగళ
న్యస్త సువర్ణసూత్ర పరిహర్తకు దానవలోకభర్తకున్.

బలి వడుగా యెవ్వరివాడ వెవ్వడవు సంవానస్థలంబెద్ది? నీ

వడుగంబో యెడిదేది? రత్నములో? మృష్టాన్నం
బులో? కన్యలో?

వామన ఓ నానామఖ వ్రతదాన ప్రవణాను వర్తీ, దానవ
చక్రవర్తీ.
ఇది నాకు నెలవని యేరీతి బలుకుదు నొకచో
టనక యెందునుండ నేర్తు
నెవ్వనివాడ నంచేమని పలుకుదు నాయంత
వాడనై నడవనేర్తు
నీ నడవడియని యెట్లు వక్కాణింతు బూని
ముప్పోకల బోవనేర్తు
నది నేర్తు నిది నేర్తు నని యేల చెప్పంగ నేరుపు
లన్నియు నేన నేర్తు
ఒంటివాడ నాకు నొకటి రెండడుగుల
మేరయిమ్ము సొమ్ము మేరయొల్లఁ
గోర్కిదీర బ్రహ్మకూకటి ముట్టెద
దాన కుతుకసాంద్ర దానవేంద్ర.
నీవు రాజవనుచు నిఖిలంబు నడుగుట
దగవు కాదునాకుఁ దగిన కొలఁది
యేను వేఁడికొనిన యీ పదత్రియమును
జాలదనక యిమ్ము చాలుఁ జాలు

శుక్ర ఓహో, మోసము, మోసము
దనుజేంద్ర, యీతఁ డు ధరణీ సురుడుగాడు
హరి విష్ణుఁడవ్య యుండదితి సూతి

నీ లక్ష్మి దేజంబు నెలవు నైశ్వర్యంబు
వంచించి యిచ్చు దా వాసవునకు
ఏ దానమున నాశమేతెంచు నదియును
దానంబు గాదండ్రు తత్త్వ విదులు
అంగీకరించిన నఖిలంబు బోవుచో
ననృతంబుగాదు లేదనిన యెడల

మరియు నిందొక్క విశేషంబు గలదు, వివరించెద
వారి జాతులందు వైవాహికములందు
ప్రాణ విత్తమాన భంగమందుఁ
జకిత గోకులాగ్ర జన్మరక్షణమందు
బొంకవచ్చు నఘము బొందదధిప

బలి సునిశిత ధిషణాధుర్యా, శుక్రాచార్యా,
నిజమానతిచ్చితి నీవు మహాత్మక
మహిని గృహస్థ ధర్మంబు నిదియ
యర్థంబు, గామంబు యశమును వృత్తియు
నెయ్యది ప్రార్థింప నిత్తుననియు
నర్థలోభంబున నర్థిఁబొమ్మను నెట్లు
పలికి లేదనుకంటె బాపమెద్ది?
యెట్టి దుష్కర్ముని నే భరించెదగాని
సత్యహీనుని మోవజాల ననుచు
బలుకదే తొల్లి భూదేవి బ్రహ్మతోడ
సమరమున నుండి తెరుగక చచ్చుకంటెఁ
బలికి బొంకక నిజమునఁ బరఁగుకంటె

మానధనులకు భద్రంబు మఱియు గలదె?
కాశేరాజులు, రాజ్యముల్ గలుగవే.
గర్వోన్నతిన్ బొందరే?
వారేరీ? సిరిమూట గట్టుకొని పో
వంజాలిరే? భూమిపై
బేరైనం గలదే? శిబిప్రముఖులుం
బ్రీతిన్ యశఃకాములై
యీరే కోర్కులు వారలన్ మరచిరే
యిక్కాలమున్ భార్గవా.
నిరయంబైన, నిబద్ధమైన, ధరణీ
నిర్మూలనంబైన, దు
ర్మరణంబైన గులాంతమైన నిజమున్
రానిమ్ము కానిమ్ము పో
హరుడైనన్, హరియైన నీరజభవుం
డభ్యాగతుండైన నాఁ
దిరుగన్ నేరదు నాదు జిహ్వ వినుమా
ధీవర్య, వేయేటికిన్.
వింధ్యావళి – బలిచక్రవర్తి భార్య –
వటుని కాళ్లు గడుగుటకు ఇదిగో హేమఘటమున సలిలములు.

ప్రకటన అంతట బలిచక్రవర్తి ధరణీసుర దక్షిణ చరణ ప్రక్షాళనంబు సేసి, వామ పాదంబు గడిగి తత్పావనజలంబు శిరంబునం జల్లుకొని, వార్చి, దేశకాలాది పరిగణనంబు సేసి –

విప్రాయ ప్రకటవ్రతాయ భవతే విష్ణుస్వరూ
పాయ వేదప్రామాణ్యవిదే త్రిపాద ధరణి దాస్యా
మియంచుం గ్రియా క్షిప్రుండై దనుజేశ్వరుండు
వడుగుం జేసాచి పూజించి బ్రహ్మ ప్రీతమ్మని
ధారపోసె భువనం బాశ్చర్యముంబొందగన్.

తత్కాలంబున

నీరధార బడగనీక యడ్డంబుగా
గలశరంధ్రి మాపగాను దెలిసి
హరియుం గావ్యనేత్రమటం గుశాగ్రంబున
నడువ నేక నేత్రుడయ్యె నతడు
తదనంతరంబున
మునిజననియ మాధారను
జనితా సురయువతి నేత్రజల కణధారన్
దనుజేంద్ర నిరాధారను
వనజాక్షుడు గొనియె బలివివర్జిత ధారన్
ఇట్లు ధారాపరిగ్రహంబు సేసి —
ఇంతింతై వటుడింతయై మరియు దానింతై
నభోవీధిపై
నంతై తోయజ మండలాగ్రమున కల్లంతై
ప్రభారాశిపై
నంతై చంద్రుని కంతయై ధ్రువునిపై నంతై
మహార్వాటిపై
నంతై సత్యపదోన్నతుండగుచు బ్రహ్మాండాంత
సంవర్ధియై

రవిబింబం బుపమింపఁ బాత్రమగు ఛత్రింబై శిరోరత్నమై
శ్రవణాలంకృతమై కళాభరణమై సౌవర్ణ కేయూరమై
ఛవిమత్కంకణమై కటిస్థలి సుదంచద్ఘంటయై నూపుర
ప్రవరంబై పదపీఠమై వటుడు దా బ్రహ్మాండమున్ నిండుచోన్.

ఒక పదమ్ము క్రింద నుర్విపద్మమునంది
కొన్న పంకలవము కొమరుదాల్చె
ఒకరి మీద తమ్మి కొదిఁగిన తేఁటి నా
వెలసె నాకసము త్రివిక్రమమున.

పాదద్వయంబున ప్రపంచమునెల్ల సమాక్రమించి త్రివిక్రముండు మూడవ యడుగును వైరోచని శిరస్సుపై నిలిపి యతని నథః పాతాళమున కణంచివైచె నిది యిందలి పూర్వగాథ.

స్వర్గలోకం.

ఆహ్లాదకరమైన జంత్రవాద్యాల సంగీతంతో ఈ రంగం ప్రారంభ మవుతుంది —

ఉపనిషద్వాచకం.
సహనావవతు
సహనౌభునక్తు

సహవీర్యం కరవావహై
తేజస్వినావధీతమస్తు
మా విద్విషావహై
సితసునిశిత కాంతులతో
ద్యుతల మతుల కాంతిమయం
వాడని పూవులతో
వీడని తావులతో
అనంతమౌ వసంతమై
వినూత్నమై పవిత్రమై
సునిశిత సితకాంతులతో
సుఖశిఖరపు శోభలతో
అజ్ఞానం తరిమికొట్టి
విజ్ఞానం పంచిపెట్టి
వీరకథలు వర్ణించి
ప్రేమసుధలు వర్షించి
ద్యుతల మతుల దీప్తిమయం
త్రిదినముదిత శుభాహ్వాయం.
అప్సరాంగనల నాట్యం.

దేవేం అదుగో, ఆ అప్సరఃకన్యక అమోఘంగా నాట్యం చేసింది. ఎవరా అపూర్వలావణ్యావతి?

దేవమం ఆమె యింకా అర్భకురాలు ప్రభూ. దేవేంద్రుల వారేమో నేడు కసుగందని పసికందుల నాశి స్తున్నారు.

దేవేం మంత్రీ, ఆ బాలిక మనమదాలస కూతురు. నేనెరుగుదును. వెంటనే ఆమెను నా సమక్షంలో నిలబెట్టు.

అప్స ప్రభువులకు ప్రణామం.

దేవేం నీ యౌవనం సాఫల్యమొందునుగాక. అద్భుతంగా నాట్యం చేశావు అమ్మాయీ.

అప్సర ప్రభువుల అనుగ్రహం.

దేవేం మాకు పరమానందమయింది. నీ పేరేమిటి అమ్మాయీ.

అప్సర నాపేరా? నాపేరు_

దేవేం సిగ్గుపడకు మరి. చెప్పవూ నీపేరు?

అప్స జలాంతశ్చంద్రచపల.

దేవేం జలాంతశ్చంద్ర చపల. ఎంత బాగుంది పేరు అయితే ఇంత చిన్నపిల్లకి అంతపెద్ద పేరెందుకూ? చపలా అని పిలవనా?

అప్స ఏమో, ప్రభువులఇష్టం.

దేవేం పోనీలే. పూర్తిపేరుతోనే పిలుస్తాను. జలాంతశ్చంద్ర చపలా. చక్కనిపాట ఒకటి పాడవూ?

అప్సర పాడుతుంది.

ధీరసమీరే యమునాతీరే
వసతివనే వనమాలీ
గోపీపీన పయోధర మర్దన
చంచల కరయుగశాలీ.

మంత్రి దేవగురువులెందుకో తొందరగా విచ్చేస్తున్నారు. ప్రభూ.

దేవేం మంత్రీ, నీవు వారిని ఆలోచనా మందిరంలోకి తీసుకువెళ్ళు. మేము మొదట నందనవనానికి. తర్వాత శయ్యామందిరానికి రా అమ్మాయీ.

మొగోం ఇంద్రభోగం అంటే అది.

రెంగోం ఇదేనా స్వర్గం? ఇంతకంటె పాతాళలోకమే బాగుందే.

చిరం ఇంద్రుని చర్యలతో మీ
రెందుకు కొలుస్తారు స్వర్గాన్ని ?

మొగోం ఎవరు బాబూ మీరు?
ఇక్కడ ప్రత్యక్షమయారు ?

చిరం నన్ను చిరంజీవి అంటారు
ఎప్పుడూ ఇప్పుడులో ఉంటాను
ఎక్కడా ఇక్కడగా ...

మొగోం ఇదివరకీయన్ని చూశాంకాదూ ?

చిరం ఔను. నరకంలో నేను నిర్జీవిని. స్వర్గంలో చిరంజీవిని.

మొగోం ఔరా, ఏమాశ్చర్యం ?

చిర ఓరి వెర్రిమానవులారా, మీది తెలిసీ తెలియని గొడవ.

జీవించాలి నిరాఘాటంగా

జీవించాలి సునాయాసంగా
సత్యానికీ అసత్యానికీ
సమానదూరంగా
జీవించాలి అమోఘంగా
సేవించాలి ద్రాక్షాసవం
సాధించాలి అజరామరత్వం
శోధించాలి విశుద్ధతత్వం
పరిపాలించాలి మన్మధ సామ్రాజ్యం
ప్రతిభాసించాలి ప్రచండ వైరాగ్యం
జీవించాలి తృణప్రాయంగా
ఘుణాక్షరన్యాయంగా
కాకతాళీయంగా
జీవించాలి ఆకస్మికంగా
జీవించాలి ఏకస్మితంగా

మొ. గొం చిరంజీవి చాలా హుషారుగా ఉన్నాడు,
రెం. గొం: మరి ఇదిస్వర్గం కాదూ.

చిరం నేనొక బికారిని
భిక్షుకుణ్ని
తెర వెరుగని తెరువరిని
నేనేమీకాను.
నిరాధారుణ్ని
నిరాకారుణ్ని
నాజోలిలో జాలి నింపండి
మీకు పురుగులెంత లోకువో



పురుగులకంత లోకువ నేను అన్నిటికీ తెగించాను
నన్నుచూచి నవ్వకండి నామీద రాళ్ళురువ్వకండి

మొ. గొం: ధోరణి మారిందేం?

చిరం: బలిచక్రవర్తి వచ్చినట్లు పసిగట్టు తున్నాను. అంచేత, నా గానంలో విషాదం ప్రవేశించింది.

రెం. గొం: బలిచక్రవర్తి స్వర్గలోకాని కెందుకు వస్తాడు?

చిరం: రాదలచుకుంటే అతణ్ని ఎవ్వరూ అడ్డలేరు. పాతాళలోకపు పాపాత్ములను, పతితాత్ములను అనాధజీవులను, అశాంత భావులను వదలిపెట్టి అతడు రాడు, కాని ఏ కారణం వల్లనో ఇప్పుడు బలిచక్రవర్తి యిక్కడే వున్నాడని నేను చెప్పు కోగలుగు తున్నాను.

మొ. గొం: అడుగో బలిచక్రవర్తి.

రెం. గొం: అతని వెంట ఎవరో అమ్మాయి.

బలి: అవును. ఈపిల్లపేరు జలాంతశ్చంద్రచపల. ఈ పిల్ల ఏడుపు విని యిక్కడకు వచ్చాను. ఎవరేడ్చినా నేనుసహిం చలేను. నందనవనంలో నాకు కనబడింది. ఇంద్రుడీమెను చెర బట్టబోయాడు. నేనురాగానే పరుగెత్తి పోయాడు.

మొ. గొం: దయామయుడు బలిచక్రవర్తి.

రెం. గొం: ధర్మాత్ముడు బలిచక్రవర్తి.

బలి: ఇక నే నిక్కడ వుండనక్కరలేదు. యీామెను తీసుకొని పాతాళానికి పోతున్నాను.

చిరం: నాకు చిరంజీవిగాఉండాలని లేదు. నేనూవస్తున్నాను. జలాంతశ్చంద్రచపల కోసం నేనునిర్జీవినికాదలచుకున్నాను.



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA117B137 |
| పుస్తకం పేరు | మరో ప్రపంచం |
| తారీఖు | 28/10/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | no |
| మొత్తం పేజీలు | 149 |
| పెద్ద సైజు పేజీలు | No |
| ఖాళీ పేజీలు | CI |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | SOWMYA |
| పేజీలు విడదీసినది | SOWMYA |
| స్కాన్ చేసినది | Mounika |
| పరీక్ష చేసినది | pragathi |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |